# ఆర్యక్షత్రియ సంఘం, గుంటూరు.

## గుంటూరు-522 002. ఆంధ్రప్రదేశ్







**శ్రీ మాతా నిమిషాంబికాదేవి**

ఆర్యులారా !

మన చంద్ర వంశ రాజులు (సోమ (చంద్ర) వంశీయులని కూడా వ్యవహరించెదరు) ఆరాధ్య దేవత **"శ్రీ నిమిషాంబాదేవి అమ్మవారు".** మొదటి నుండి ఈమెను మన కులదేవతగా పూజించు చున్నారు. నేడు ఈ అమ్మవారి ఆలయములు తెలుగు రాష్ట్రాలలో హైదరాబాద్, కర్నూలు, నంద్యాల, కడప, విజయవాడ, ఏలూరు, ఖమ్మం మొ॥ పట్టణములందునూ, కర్ణాటక రాష్ట్రము నందు బెంగుళూరు, బళ్ళారి మరియు శ్రీరంగపట్టణమునకు మూడు కిలోమీటర్ల దూరమున గల **"గంజాం"** అను పల్లెలో కావేరి నదీపాయ ఒడ్డున ఈ అమ్మవారు మొదటిగా వెలసినది. ఈ ఆలయమునకు నిత్యము వేలాది భక్తులతో, పూజలతో అలరారుచున్నది. భక్తుల కోర్కెలు నెరవేర్చుకుంటున్న మన ఇలవేల్పుగా ప్రసిద్ధి గాంచినది. ముందుగా ఆంధ్ర రాష్ట్రములో విశేష ప్రఖ్యాతిగాంచిన గుంటూరు పట్టణములో మన చంద్ర వంశస్థులు గత 100 సం॥ల క్రితము నుండి మన కులస్తులను **ఆర్య క్షత్రియులు** అని సంబోధించు చున్నారు. వీరు చిత్రలేఖనములోనూ, నగిషీపని, దేవుని వాహనములు, బంగారు ఆభరణముల తయారీలోనూ మరియు ఇత్తడితో, వెండితో దేవతామూర్తులను తయారుచేసి ప్రసిద్ధి గాంచిరి. వీరికి పేరు చివర **రాజు** లేక **వర్మ** అని సంబోధిస్తున్నారు.

**దేశ, ప్రపంచవ్యాప్తంగా క్షత్రియ జాతులు :**

- **వాయువ్య భారతదేశం :** అహిర్, జాట్‌లు, గుజ్జారులు, రాజపుత్రులు
- **ఈశాన్య భారతదేశం :** మణిపురి, అసోం, త్రిపురి క్షత్రియ
- **నేపాల్, హిమాలయాలు :** పహాడీ, ఛెత్రి, శ్రేష్ఠ, శాక్య, థకురి, థప రాజపుత్రులు
- **దక్కను భారతదేశం :** 96 కులీ మరాఠా తెగలు
- **తూర్పు భారతదేశం :** థాకూర్, ఖండాయత్
- **దక్షిణ భారతదేశం :** ఆంధ్ర క్షత్రియ, తులునాడు క్షత్రియ
- **ఇండోనేషియా :** బాలనీయులు, జావనీయులు

**క్షత్రియులు :**

క్షత్రియులు అనునది హిందూ మతములోని పురాణాల ప్రకారం చతుర్వార్ణాలలో రెండవది 'క్షత్రియ వర్ణం'. ***"క్షాత్రాత్ త్రాయత ఇతి క్షత్రః తస్య అపత్యం పుమాన్ క్షత్రియః"*** – అనగా ప్రజలను సమస్త దుష్టత్వం నుండి రక్షించి పరిపాలించువాడు క్షత్రియుడు. వర్ణాశ్రమ దర్మం ప్రకారం క్షత్రియులు యుద్ధవీరులు, సామ్రాజ్యాలు పరిపాలించవలసినవారు. భారతీయ మత గ్రంథాలలో పేర్కొనబడిన శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, గౌతమ బుద్ధుడు, వర్ధమాన మహావీరుడు వంటి ఎందరో దైవ స్వరూపులు క్షత్రియులుగా జన్మించారు. వటవృక్షము (మర్రిచెట్టు), దండము మరియు రెండు ఖడ్గాలతో కూడిన డాలు క్షత్రియ చిహ్నాలుగా నిలుస్తాయి. క్షత్రియుడు అనే పదానిని స్త్రీలింగము క్షత్రియాణి. కులం పేరులో క్షత్రియ అన్న పదం ఉన్నంత మాత్రన క్షత్రియులు కాదు. నిజమైన క్షత్రియులు ఎక్కడో ఒక చోట తప్పితే అందరూ అంతరించిపోయారు అన్నది నిర్వివాదాంశం.

క్షత్రియులు దాన ధర్మాలు చేయ్యడంలో వీళ్ళకెవ్వరు సాటిరారు. ముఖ్యంగా చంద్ర వంశస్థులు గొప్పవారు. ఆదిలో క్షత్రియులు అనునది ఆర్యుల తెగల్లో ఒక చీలికగా యున్నది. ఆర్యుల సమాజం వృత్తిని బట్టి కులవిభజన జరిగినప్పటికీ, తరువాత కాలంలో గణమునుబట్టి, మధ్యయుగములో జన్మనుబట్టి **'క్షత్రియ'** అనే పదం ఉదహరించబడినది.

క్షత్రియ సామాజిక సోపాన క్రమంలో వీరు పాలక మరియు సైనిక ఉన్నత వర్గ యోధులు. యుద్ధ సమయంలో పోరాడటం మరియు శాంతి సమయంలో పాలించడం, పౌరులను రక్షించడం వీరి బాధ్యత. క్షత్రియులు మొదట్లో గుణం, ప్రవర్తన, సేవా గుణాల అర్హతలపై ఈ హోదాను సాధించారు. తరువాత కుల వ్యవస్థ అభివృద్ధి చెందటంతో ఈ యోగ్యతా స్థితి వంశపారంపర్యంగా మారింది.

చంద్రవంశముకంటే సూర్యవంశము గొప్పది అని కొద్ది మందిలో అపోహ ఉంది. రామాణం ప్రకారం సూర్యవంశానికి చెందిన దశరధ మహారాజు కుమారుడైన శ్రీరాముడు చంద్రవంశానికి చెందిన మిధిల రాజు జనక మహారాజు కుమార్తె అయిన సీతాదేవిని వివాహమాడాడు. చాళుక్య, చోళ వంశాలకు మధ్యకూడా వివాహాలు జరిగాయి. ఇలా వందల సంవత్సరాల నుండి వివాహాలు జరుగు తున్నాయి. కనుక రెండు వంశాలు సమానమే.

**క్షత్రియ రాజవంశాలు :**

**(1) సూర్యవంశం :** సూర్యుడిని ఆరాధించిన క్షత్రియులు. ఉదా : ఇక్ష్వాక్షు వంశం.

**(2) చంద్రవంశం :** చంద్రుడుని ఆరాధించిన క్షత్రియులు. ఉదా : మహా భారంతంలోని శ్రీకృష్ణుడు, పాండవులు; చరిత్ర పుటలలో బాదామీ చాళుక్యులు, పూర్వ చాళుక్యులు, శాలంకాయనులు, గౌతమ బుద్దుడు, ఛత్రపతి శివాజీ మొ॥వారు.

**(3) అగ్నివంశం :** బధారియ, చౌహాన్, పరిహార్, పన్వర్ & సోలంకి మొదలగు తెగలు అగ్నివంశానివి. అజ్మీర్‌ను పాలించిన పృధ్వీరాజ్ చౌహన్ అగ్ని వంశములో గొప్పవాడు, ఆఖరివాడు.

**(4) నాగవంశం :** నాగులను ఆరాధించేవారు. వీరు ప్రధానంగా శైవులు. వీరిలో నైర్, బంట్, సహారా, బైస్, నాగ, తక్షక, జాట్ తెగలు ఉన్నాయి. నాగాలాండ్, ఛోటా నాగపూర్, మణిపూర్, కల్హాండి, మహారాష్ట్రల నుండి వలస వచ్చారు. భారతదేశంలో అతి ప్రాచీన క్షత్రియ సామ్రాజ్యాలలో నాగవంశం

ఒకటి. కేరళలో అనంత పద్మనాభస్వామికి చెందిన ట్రావెన్కోర్ మహారాజు మార్తాండవర్మ నాగవంశానికి చెందినవాడు. వర్ణవ్యవస్థ ప్రకారం క్షత్రియులైనా నేడు వెనుకబడిన కులాల్లో చేర్చబడ్డారు.

**క్షత్రియ జాతుల వివరణ :**

**(1) యాదవులు లేక అహీరులు :** వ్యవసాయం, పశుపోషణ. భారతకథలోని శ్రీకృష్ణుడు ఈ తెగకు చెందినవాడే. క్రీ.శ. మొదటి, రెండవ శతాబ్దాలలో మాళవ, సౌరాష్ట్ర, మహారాష్ట్ర ప్రాంతాలను పరిపాలించారు.

**(2) జాట్‌లు :** ఇండో ఆర్యన్ తెగలు. యుద్ధవీరులు. మహారాజా సూరజ్‌మల్ వీరి పూర్వీకుడు. వీరిలో 36 తెగలున్నవి.

**(3) గుజ్జారులు :** వీరిలో చాలా వరకు సూర్యవంశానికి చెందినవారు. ఉత్తర భారతాన్ని పరిపాలించారు.

**(4) రాజపుత్రులు :** వీరికి గుజ్జారులతోనూ, ఆంధ్ర క్షత్రియులతోనూ వివాహ సంబంధాలుండేవి. వీరికి సూర్య, చంద్ర, అగ్ని వంశాలున్నాయి.

**(4) రాజులు :** ఆంధ్రా కోస్తాలోనూ, తెలంగాణలలో, రాయలసీమలలో ఉన్నారు. హిందూ పురాణాలు, బౌద్ధ, జైన మత గ్రంథాల ప్రకారం క్రీస్తుకు పూర్వం నుండే ఉత్తర భారతం నుండి వలస వచ్చారు. వీరు విష్ణు కుండినులు, గజపతి, కళింగ, చోళులు, చాళుక్యులు, పల్లవులు, శాతవాహన, కాకతీయ సామ్రాజ్య వంశస్థులు.

ఇంకా మణిపురి; అసోం; త్రిపుర క్షత్రియులు; పహాడీ రాజపుత్రులు జమ్ము కాశ్మీర్, ఉత్తరాఖండ్ హిమాచల్ ప్రదేశ్; శ్రేష్ఠ; శాక్యులు గౌతమ బుద్ధుడు ఈ వంశస్తుడే; థకూరి; థప వీరు నేపాల్, టిబెట్ రాజ వంశస్థులు; కులీ మరాఠాలు మహారాష్ట్ర, గోవా, కర్ణాటక, మధ్యప్రదేశ్. వీరిలో 96 తెగలు కలవు. వీరిలో ఛత్రపతి శివాజీ ప్రముఖులు; ఠాకూర్‌లు; ఖండాయత్‌లు ఒరిస్సా; తులునాడు క్షత్రియ కర్ణాటకలోని తులునాడు ప్రాంతీయులు, నాగవంశీయులు; కూర్గ్‌లు వ్యవసాయదారులు, యుద్ధ వీరులు. వీరు స్కాంద పురాణం ప్రకారం చంద్ర వంశీయులు; బాలనీయులు ఇండోనేషియా; జావనీయులు ఇండోనేషియా జావా ద్వీపములందు నివసించిన క్షత్రియులు.

వైదిక క్షత్రియులకు మూల పురుషులుగా ఋషులు వారి ప్రవరలు, వంశములో ప్రముఖ వ్యక్తులు ఉంటారు. కనుక వారి పేర్లు గోత్ర నామాలుగా కలిగి ఉంటాయి.

**ఆంధ్ర దేశములో క్షతి్రయులు :**

ఈ క్షత్రియులు ఉత్తర భారతము నుండి క్రీ.శ. 1వ శతాబ్ది తారువాత వలసలు ప్రారంభమైనాయి. క్రీ.శ.14వ శతాబ్దానికి ముందు ఇంటి పేర్లు లేవు. గోత్రాల మరియు వంశము పేర్లతో శాసనాలలో గుర్తించబడ్డారు. క్షత్రియులు అనగా రాజపుత్రులే అని అపోహ ఉన్నది. ఉత్తర భారతాన్ని ఏకఛత్రాధిపత్యంగా ఏలిన క్షత్రియుల్లో రాజపుత్రులు ఒకరు. ఆంధ్ర దేశంలో గజపతులు క్షత్రియులే. దేశంలో ఇప్పుడు చాలా కులాల వారు తాము క్షత్రియులమేనని పేర్ల చివర రాజు, వర్మ అని చెప్పుకొంటున్నారు.

అంతర్గత విభేధాలు, విదేశీ దండయాత్రలు, కరువు మొదలైన వాటి కారణంగా ఆంధ్ర క్షత్రియులు ఆర్యవర్త (ఉత్తర భారతదేశం) నుండి దక్షిణానికి వచ్చారని పురాణాలు, చరిత్ర వలన తెలుస్తోంది. వాయు పురాణం, బౌద్ధ

మరియు జైన సాహిత్యాలు ఇక్ష్వాకు క్షత్రియుల వలస గురించి ప్రస్తావించాయి. పురాతన శాసనాలు, సాంప్రదాయ వృత్తాంతాలు మరియు చారిత్రక ఆధారాల ఆధారంగా, ఆంధ్ర రాజులు ఈ క్రింది పురాతన వంశాల వారసులు :

**(1) విష్ణుకుండినులు :** ఈ రాజ వంశానికి చెందిన మాధవవర్మ ఆంధ్రకు వలస వచ్చారని ఒక జానపద కథ పేర్కొంది.

**(2) చాళుక్యులు :** చంద్రవంశీ రాజులు తూర్పు చాళుక్యుల వారసులు.

**(3) పూసాధిపతులు (4) ధరణికోట రాజులు (5) సాగి, వత్సవ రాజులు (6) హైహేయ రాజులు (7) గజపతి మరియు సలూర్ జమీందార్లు (8) ఒరిస్సా - మాడ్గోల్ జమీందార్లు.**

రాజులను రెండు విభాగాలుగా వర్గీకరించారు (పురాతన క్షత్రియ సాంప్రదాయ వంశాల ప్రకారం) : **(1) సూర్యవంశీ :** విష్ణుకుండినులు, పరిచేడులు, కోట వంశము, చోళ - చాళుక్యులు (చోళులు సూర్య వంశీ మరియు చాళుక్యులు చంద్రవంశీఅని పేర్కొన్నారు. రెండు కుటుంబాలు విలీనం అయ్యాయి), తూర్పు గంగా మరియు గజపతి. **(2) చంద్రవంశీ :** తూర్పు చాళుక్యులు, కలచురిస్ (చెడి - హైహేయ), సాళువ మరియు విజయనగరంలోని అరవీడు రాజవంశాలు.

**(1) విష్ణు కుండిన రాజవంశం :** క్రీ.శ. 5 నుండి 7వ శతాబ్దం వరకు ఆంధ్రప్రదేశ్‌ను పరిపాలించారు. విష్ణుకుండినులు మాధవవర్మతోపాలు శాలంకాయనులను జయించి తమ పాలన స్థాపించారు. బెజవాడలో, కొల్లిపాకలో నగరాలు నిర్మించారు. 7వ శతాబ్దంలో దక్షిణానికి వలస వచ్చిన మేవార్ మహారాణా వారసులుగా భావిస్తారు. జైన మతానికి పోషకులుగా ఉన్న చాళుక్యులకు భిన్నంగా హిందూ ధర్మాన్ని పోషించారు. విజయ రామరాజు పేరు మీద విజయనగరం స్థాపించారు. 16వ శతాబ్దంలో ఉత్తర సర్కార్‌లలో నందపూర్ యుద్ధం తరువాత గజపతి అనే బిరుదు పొందారు.

**(2) తూర్పు చాళుక్యులు :** చాళుక్యులు, విష్ణుకుండినుల తరువాత వచ్చిన రాజవంశం. దక్షిణ మరియు మధ్య భారతంలోని పెద్ద ప్రాంతాలను క్రీ.శ. 550 నుండి 750 మధ్య మరియు క్రీ.శ.973 నుండి 1190 మధ్య పాలించారు. కర్ణాటక నుండి ఉద్భవించిన చాళుక్యులను పులకేసి-11 చేత ఆంధ్రదేశంలోకి వచ్చారు. వీరు యలమంచిలి, పిఠాపురం, ముదిగొండ వంటి సంస్థానాలను పాలించాయి. తూర్పు చాళుక్యులు, చంద్రవంశ క్షత్రియులు, ఆంధ్రాలోని ఇతర క్షత్రియ కుటుంబాలతో వివాహ సంబంధాల ద్వారా దగ్గరి సంబంధం కలిగి ఉన్నారు. వైవాహిక పొత్తులద్వారా తూర్పు చాళుక్యులు చోళులలో విలీనమైయ్యారు.

**(3) విజయనగరం రాజులు (గజపతిరాజులు) :** విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన నాలుగు రాజవంశాలలో సాళువ, అరవీటి వంశాలున్నాయి. వీరి పూర్వీకుడు తూర్పు చాళుక్యరాజు అభిమానాన్ని పొందాడు. తెలుగు మాట్లాడే క్షత్రియ రాజులు హంపి ప్రాంతాలలో స్థిరపడ్డారు. శ్రీకృష్ణదేవరాయల మేనల్లుడు అళియరామరాజు మరణం తరువాత క్రీ.శ.1614 నుండి 1616 వరకు గొప్ప వారసత్వ యుద్ధం జరిగింది. సింహాసనం హక్కుదారులలో గొబ్బూరి జగదేవరాజు కూడా ఉన్నారు. వీరు చంద్రవంశ రాజు. పదహారవ శతాబ్ది ప్రారంభంలో మహామండలేశ్వరునిగా నియమించబడ్డారు.

**ఇంటిపేర్లు :** దాదాపు క్రీ.శ. 14వ శతాబ్దం వరకు ఇంటిపేర్లు లేవు. దీనికి ముందు కాలంలో గోత్రాలు (వంశాలు) మాత్రమే ఉన్నాయి. ఇంటిపేర్లు గ్రామాల పేర్ల ఆధారంగా, ప్రకృతి ఆధారంగా, ప్రముఖ పూర్వీకుల పేర్ల ఆధారంగా ఏర్పడ్డాయి. రాయలసీమ, కర్ణాటక రాజులకు ఇంటిపేర్లు లేవు.

***"క్షాత్రాత్ త్రాయత ఇతి క్షత్రః తస్య అపత్యం పుమాన్ క్షత్రియః"***

ప్రజలను సమస్త ఆపదల నుండి కాపాడి పరిపాలించువాడు క్షత్రియుడు. పురాణాలను, చరిత్రను బట్టి శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, బుద్ధుడు, వర్ధమాన మహావీరుడు వంటి ఎందరో క్షత్రియులుగా జన్మించారు. వటవృక్షం (మర్రిచెట్టు), దండము, రెండు ఖడ్గాలతో కూడిన డాలు వంటివి క్షత్రియుల రాజ చిహ్నాలు.

మన భరతఖండంలో ముఖ్యమైన కులవర్గాలను నాలుగు వర్గాలుగా అభివర్ణించారు. మొదటగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర. ఈ నాలుగు వర్గాలలో కేవలం మొదటి మూడు వర్గాలకే మాత్రమే ఋషుల పేర్లను గోత్రాలుగా వర్గీకరించారు. మిగిలిన శూద్ర కులానికి వస్తువుల పేర్లు, ఊర్లపేర్లు ఇచ్చారు.

మన పురాణాల ప్రకారం బ్రాహ్మణులకు 16, క్షత్రియులకు 32, వైశ్యులకు 46+62 = 108 గోత్రాలను కేటాయించడం జరిగింది.

క్షత్రియ వర్గానికి కేటాయించబడిన 32 మంది ఋషుల పేర్లు : **(1) ఆత్రేయ (అత్రి) (2) కశ్యప (3) వశిష్ఠ (4) కౌండిన్య (5) విశ్వామిత్ర (కౌశిక) (6) ధనుంజయ (7) జమదగ్ని (8) శ్రీవత్స (9) సనందన (సనక సనందనాధులు) (10) భరద్వాజ (11) గౌతమ (12) భృగు (13) నారద (14) ఆగస్త్య (15) హరిత (హరీష) (16) పరాశర (17) గార్గేయ (18) సాంఖ్యాయన (19) శాండిల్య (20) దుర్వాస (21)మైత్రేయ (22) మౌద్గల్య (23) చవ్యన (శ్రావణ) (24) అంగీరస (25) దత్తాత్రేయ (26) వైశంపాయన (27) కణ్వ (28) వ్యాస (29) జానస్వల (30) కపిల (31) జమున (యమున) (32) ప్రోలస్య.** ఈ 32 గోత్రాలు మాత్రమే క్షత్రియ వర్గానికి కేటాయించారు. ప్రతి గోత్రానికి ఒక వంశాన్ని సూచించే ఒక గోత్ర ప్రవర ఖచ్చితంగా ఉంటుంది. గోత్ర ప్రవర లేకపోతే అసలు ఆ గోత్ర పురుషుడు ఋషి కాదని గ్రహించాలి.

**సోమ (చంద్ర) వంశ ఆర్యక్షత్రియులు :**

వీరు ఉత్తర భారతదేశము నుండి వలస వచ్చినవారు. అక్కడి సంస్థానములను పరిపాలిస్తూ, ముస్లింల దండయాత్రకు ఓటమిపాలై బానిస బ్రతుకు బ్రతకలేక దక్షిణ భారతానికి వలస వచ్చారు. వీరికి ఉపనయనము తప్పనిసరి. వీరు సోమ (చంద్ర) వంశమునకు చెందినవారు. వీరి గురించి మహాభారములో మరియు బ్రహ్మాండ పురాణములోని వర్ణవైభవ కాండ అను భాగమున క్లుప్తముగా వివరింపబడినది. బ్రాహ్మణులవలె వీరికికూడ ఋషుల గోత్రాలు కలవు. వీరిలో 4 తెగలు కలవు. **(1) జీనిగర్ (2) చిత్తారి (3) చిత్రకార (4) నకాషీ.** కానీ కుల ప్రసక్తి వచ్చినప్పుడు **"ఆర్యక్షత్రియ"** అని వ్యవహరిస్తారు.

సోమ (చంద్ర) వంశీయుడైన చిత్రరథుని కుమారుడు **'శశిబిందువు'** అనే మహారాజుకు వారసులు. వీరి కులదేవత **'నిమిషాంబాదేవి'.** కొన్ని వందల సంవత్సరాలు ఉత్తర భారతాన్ని పాలించిన వీరు పాలన కోల్పోయి వలసదారులయ్యారు. కొంతమంది మహారాష్ట్ర మీదుగా కర్ణాటక, ఒరిస్సా,

ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ వలసవెళ్ళారు. నదీ పరివాహక ప్రాంతాలలో ఎక్కువగా జీవనం సాగించారు. జీనిగర్లు కోస్తా ప్రాంతంలోనూ, చిత్తారివారు రాయలసీమలోనూ, చిత్రకార వారు కర్ణాటకలోనూ, నకాషీవారు తెలంగాణలోనూ ఎక్కువగా ఉన్నారు.

రెండు తెలుగు రాష్ట్రాలలో ఆర్యక్షత్రియులు ఎక్కువగా హైదరాబాదు, అనంతపురం, కర్నూలు, నెల్లూరు, విజయవాడ, గుంటూరు, కడప, ఖమ్మం, రాజమండ్రి, నల్గొండ, విజయనగరం, చిత్తూరు, ఒంగోలలో ఉన్నారు. తెలుగు రాష్ట్రాలలో మన కుల దైవమైన **'శ్రీ నిమిషాంబాదేవి'** ఆలయాలు కర్నూలు, అనంతపురం, హైదరాబాద్, కడప, ఏలూరు మొదలగు పట్టణములలో కొలువై వున్నవి. ప్రస్తుతం వీరు చేతివృత్తులలో చిత్రకారులుగా, దేవస్థాన కట్టడాలు, కొయ్య వాహనాల తయారీ, మరియు వ్యాపార రంగాలలో, గవర్నమెంట్ ఆఫీసులలో పని చేయుచున్నారు. నిర్మల్, కొండపల్లి, చేర్యాల కళలకు ఆద్యులు వీరే.

చిత్తారి, జీనిగర్, చిత్రకార, నకాషీ వంటి ఉపకులాలు ఈ 'ఆర్యక్షత్రియ' కులం లోనివే. వీరిని క్రీ.శ.16 శతాబ్దం వరకు బాదామీ చాళుక్యులుగా వ్యవహరించారు. శాలంకాయనులు, విష్ణుకుండీనులు వీరి పూర్వీకులే. జీనిగర్లు అనబడే ఈ ఆర్యక్షత్రియులు నెల్లూరు నదీ పరివాహక ప్రాంతానికి ఎలా వచ్చారు? అని 1724వ సం॥లో అప్పటి బ్రిటీష్ జనరల్ హెచ్.ఎస్. స్టువర్ట్ వివరంగా తెలియజేశారు.

క్రీ.శ. 1624 సం॥లో మహారాష్ట్రలో ఒక ప్రాంతమైన 'జయనగర్'ను పాలించిన బాదామీ చాళుక్యులు. వీరు ముస్లిం రాజైన అల్లాఉద్దీన్ ఖిల్జీ దండయాత్రకు తాడలేక ఓటమిపాలై బానిస బ్రతుకు బ్రతకలేక దక్షిణ భారతానికి వలస వచ్చారు. అలా మొదటగా కర్ణాటక రాష్ట్రంలోని మైసూర్, శ్రీరంగపట్నం, బెంగుళూరు నుండి బళ్ళారికి వచ్చారు. అందులో కొంత మంది ఉత్తరాంధ్రలో వ్యవసాయం చేసుకొని జీవనం సాగిస్తున్నారు. ఇంకొందరు దక్షిణ ఆంధ్రలోని చిత్తూరు చేరుకున్నారు. అక్కడి చంద్రగిరి సంస్థానాధీశుడైన 'దామెర్ల చెన్నప్ప రాజు' వీరిని చేరదీసి సైన్యాధిపతి బాధ్యతలు అప్పగించారు. ఆ సమయంలో అక్కడి విశ్వబ్రాహ్మలవద్ద (కంసాలి) బంగారు పని, వడ్రంగి పని నేర్చుకొని అందులో ప్రావీణ్యత పొందారు. తరువాత రాజ్యములు అంతమై బ్రిటీషు పరిపాలన వచ్చింది. దామెర్ల చెన్నప్పరాజు సహకారంతో 1639 సం॥ము ఆగష్టు 22న బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన ఫ్రాన్సిస్‌డేకి చెన్నపట్నంలో కోటకట్టుకొనుటకు అనుమతి ఇచ్చింది. దానితో జీనిగర్లు వలసపట్టి నెల్లూరుకు చేరుకున్నారు. అలా జయనగర్ వాసులైన వీరిని జీనిగర్లుగా పిలుస్తున్నారు. భారతదేశ కులవ్యవస్థ గురించి రీసెర్చి చేసిన బ్రిటీష్ జనరల్ హెచ్.ఎస్. స్టువర్ట్ ఈ జీనిగర్స్ గురించి రీసెర్చిచేసి వీరు ఖచ్చితంగా ఉత్తర భారతానికి చెందిన సూర్య మరియు చంద్రవంశ రాజులని తెల్పారు.

*(ఈ సమాచారము ఇంటర్నెట్ నుండి మరియు సోషల్ మీడియా మాధ్యమాల నుండి సేకరించడమైనది.)*


## ఆర్యక్షత్రియ సంఘం, గుంటూరు.

**గుంటూరు-522 002. ఆంధ్రప్రదేశ్**

YNR GRAPHICS, GUNTUR. Cell : 70326 30900